# శ్రీ దత్త ప్రపత్తి

శ్రీదత్త నిత్యపూజావిధానము, అష్టోత్తర శత నామావళి,

స్తోత్రములు, సహస్ర నామములతో సంకలితము



కామన్ తెలుగు ఇంప్రెషన్స్ కార్పొరేషన్ ప్రైవేట్ లిమిటెడ్

హైదరాబాదు - 500 072

# శ్రీ దత్త ప్రపత్తి

(శ్రీదత్త నిత్యపూజావిధానము, అష్టోత్తర శత నామావళి, స్తోత్రములు, సహస్ర నామములతో సంకలితము)

: సంకలనకర్త :

తాడేపల్లి బాలసుబ్రహ్మణ్యము

కామన్ తెలుగు ఇంప్రెషన్స్ కార్పొరేషన్ ప్రైవేట్ లిమిటెడ్

హైదరాబాదు

వెల : రూ. 15-00

**SRI DATTA PRAPATTI** - A compendium of eulogies (in Sanskrit and Telugu) on Lord Sri Datta Maha Guru and the customary mode of His worship.

*Compiled by:*
TADEPALLI BALA SUBRAHMANYAM.



**First Edition:** 1000 Copies
*Kali 5104, Swabhaanu - Pushyam*
*(December, 2003 AD)*

**PRICE : Rs.15 - 00**

*Published by* :

THE COMMON TELUGU IMPRESSIONS
CORPORATION PRIVATE LIMITED
Hyderabad, Andhra.

*Laser Type-setting at :*
Sri Sai Datta Tel-E-Services, Hyderabad.

PRINTED IN THE INDIAN UNION OF STATES



# మళ్ళీ ఇంకో దేవుడా ?

హిందువుల్ని ఇతర్ల నుంచి విచక్షించి చూపించే అంశాల్లో ప్రధానతమమైంది వారు మానవత్వానికి వేసే పెద్ద పీట. వారి మతంలో దేవుఁడి కంటే మానవుడే ముఖ్యం. అసలు, దేవుణ్ణి కూడా మానవుఁడుగానే భావించి సేవించడం అనేది హిందూధర్మం చూపిస్తున్న ఓ గొప్ప మార్గం. షోడశోపచార పూజా విధానాలన్నీ అన్యాపదేశంగా బోధించేది దీన్నే. దేవుఁడు కూడా దీన్ని కాదన్లేదు. **వస్త్రం, పుష్పం, ఫలం తోయం** ఏది సమర్పిస్తే అది స్వీకరిస్తానని, ఎవరు ఎలా భావిస్తే వారికి అలానే దర్శన మిస్తానని, అవసరమైనప్పుడెల్లా మానవ రూపంలో అవతరించి దుష్టశిక్షణా, శిష్ట రక్షణా, చేస్తానని ఆయన మనకి 5104 సంవత్సరాల క్రితమే ఓ ప్రేమపూర్వకమైన వాగ్దానం చేసి ఉన్నాడు. ఆ ప్రకారమే ఆయన ఈ 5104 సంవత్సరాల్లోను అనేక పర్యాయాలు తన మాట నిలబెట్టుకున్నాడు. వీటిల్లో అంశావతారాలూ ఉన్నాయి. పూర్ణావతారాలూ ఉన్నాయి.

**అవ్యక్తా హి గతిర్దుఃఖం** అని శ్రీ మహావిష్ణువు స్వయంగా చెప్పినట్లు – కనపడని, వినపడని అదృశ్యతత్త్వాన్ని ఉన్నదనుకుని విశ్వసించి ఉపాసించే జ్ఞానమార్గం అసాధ్యం కాదు గానీ, లౌకిక లంపటాసక్తమైన మానవ స్వభావానికి కష్టమైన విషయం. మానవ జాతిలో అంతా కలిపి ఎవరో ఒకరిద్దరు మహానుభావులు ఆ స్థితికి చేరుకున్నారు, కాబట్టి అదొక్కటే దైవసమ్మతమైన మార్గం అనుకుని ఇతర పద్ధతుల్ని దైవద్రోహంగా భావించి నిరసించి ద్వేషించే వారు, చివరికి ఆ అదృశ్య తత్త్వం అందక, పైకి చెప్పుకోకపోయినా అనుష్ఠాన నాస్తికులై కూర్చోవడం సమకాలీనంగా అనేక దేశాల అనుభవంలో గమనిస్తున్న విషయం. అందుకనే 6,000 సంవత్సరాల అనుభవంతో పండిపోయిన హిందూధర్మం విగ్రహారాధనని సైతం త్రోసిపుచ్చలేదు. అలాంటి పద్ధతులకి అసహ్యమైన పేర్లూ పెట్టలేదు.

పండితమ్మన్యులు కొందరు తఱచుగా సంధించే ప్రశ్న : **హిందూమతంలో ఇంతమంది దేవుళ్ళేంటి ?** అని. భగవంతుడే సమస్త జీవరాశులుగా రూపుదాల్చాడని అంగీకరిస్తే ఆయనే మఱికొందరు దేవుళ్ళుగా అవతరించడానికి అభ్యంతరమేంటి ? దేవుళ్ళు ఇంతమంది అని కాదు హిందూమతం చెప్పేది, సమస్త చరాచర జగత్తూ భగవత్ స్వరూప మేనని !

దేవుణ్ణి మానవుడుగా భావించడం ఒక్కటే కాదు హిందూమత వైశిష్ట్యం, మానవుణ్ణి దేవుడుగా గుర్తించడం కూడాను. అందుకే, ఇతర సమాజాల్లో మచ్చుకైనా గోచరించని పితృభక్తి, మాతృభక్తి , గురుభక్తి , పతిభక్తి , అతిథిపూజలాంటి విలువలు మనకి దైవోపాసన్తో సమానమైనాయి. కాదు, అంతకంటే ఎక్కువే అయినాయి. అసలు, ఈ ఐదుగురూ సంతుష్టులు కాకపోతే మనిషి చేసే ధర్మాలూ, ఉపాసనలూ వ్యర్థమైపోతాయని మన పవిత్ర గ్రంథాల్లోను , శాస్త్రాల్లోను అడుగడుగునా హెచ్చరించడమే దీనికి నిదర్శనం.

అయితే, అందరితో పాటు హిందువులు కూడా మర్చిపోయిన విలువల్లో గురుభక్తి ఒకటి. నిజానికి, గురువు తల్లి కంటే, తండ్రి కంటే, ఆఖరికి ఆ దేవుడి కంటే కూడా మనిషికి అత్యంత ఆరాధనీయుడు. శాస్త్రం ఓ మాటా, గురువు ఇంకో మాటా చెప్పినప్పుడు, శాస్త్రాన్ని సైతం త్రోసిపుచ్చి గురువు మాటే శిరసావహించవలసిందనీ హిందూమతం బోధిస్తోంది. గురువు ఏ రకంగా మనల్ని బాధపెట్టినా అదో పరీక్ష అనుకుని ఆనందంగా స్వీకరించి భగవత్ కృపా కటాక్షానికి పాత్రులం కావాలి. ఎందుకంటే గురువులో దేవుడు లేకపోతే ఇహ ఈ ప్రపంచంలో దేవుడు లేనట్లే లెక్క. గురువు ఎవరైనా, ఎలాంటి వాడైనా సరే, ఆ స్థానం సాక్షాత్తు భగవంతుడి పీఠం. ఆ కారణం చేత, మానవమాత్రుడిలా కనపడే ఆ గురువుగారి మనః పూర్వకమైన ఆశీస్సులకీ శాపాలకీ కూడా భయంకరమైన శక్తి ఉంది. ఆయన మనకి ఏమీ నేర్పక పోయినా, ఆ పీఠం పట్ల మనకి గల భక్తే తిరుగులేని విజయ పరంపరల్ని సమకూర్చి పెడుతుంది. శివుడు కోపించినా గురువు రక్షిస్తాడని, గురువు కోపిస్తే మాత్రం శివుడు దగ్గరికి రానివ్వడని శ్రీగురుగీతలో ఖరాఖండీగా చెప్పబడింది. గురువు గ్రహాలన్నింటి కంటే బలశాలి. తన ఆశీస్సుల్తో గ్రహదోషాలన్నీ నిశ్శేషంగా పటాపంచలు



చెయ్యగలడు. గురువుగారి ఎంగిలి దొరకడం కూడా అసూయపడదగ్గ అదృష్టం. వేల సంవత్సరాలు తపస్సు చేసినా లభించని ఆత్మజ్ఞానాన్ని సద్గురువు కేవలం తన వాత్సల్య పూర్ణమైన హస్తస్పర్శ మాత్రం చేతనే ప్రసాదించగలడు. కాళీమాత శ్రీరామకృష్ణ పరమహంసకి సాక్షాత్కారం ఇచ్చింతరవాత కూడా ఆయన తోతాపురి అనే గురువుని ఆశ్రయించాలని ఆదేశించింది.

అలాంటి గురువులందరికీ సమ్రాట్టు శ్రీ దత్తాత్రేయ స్వామి. ఆయనకే దక్షిణామూర్తి అనీ, షిరిడీ సాయిబాబా అనీ నామాంతరాలున్నాయి. తానే స్వయంగా బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూప మైనప్పటికీ తనని దేవుడుగా కంటే గురువుగా సంబోధిస్తే ఆయన ఎక్కువ ప్రసన్నుడవుతాడు. అందరు జీవులకీ మోక్షం వచ్చేదాకా అవతారం చాలించని మహోద్యమం ఆయనది ఆయన్ని ఆరాధించడం మన యిష్టదేవతలకి మరింత ప్రీతికరం అవుతుందనీ, వారికి ద్రోహం చెయ్యడం అవ్వదనీ హెచ్చరించడానికే ఇంత రాయాల్సొచ్చింది. ఈ చిరుసంపుటి మిమ్మల్ని ఆయనకీ, తద్ద్వారా మీమీ యిష్టదేవతలకీ దగ్గర చేస్తుందని మనస్ఫూర్తిగా ఆశిస్తూ –

—ప్రకాశకురాలు

విజయ దశమి
అక్టోబరు 2003
హైదరాబాదు.

# శ్రీ దత్తాత్రేయ సద్గురు పూజా ప్రారంభము

**ఆచమనము:**

శ్రీకేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా, మాధవాయ స్వాహా

**హస్తప్రక్షాళనము :**

శ్రీగోవిందాయ నమః

**కేశవ నామములు :**

శ్రీవిష్ణవే నమః, మధుసూదనాయ నమః, త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధ రాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్ష ణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషో త్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనా ర్దనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః

**ప్రాణాయామము :**

<u>పూరకము</u> : ఓం భూః – ఓం భువః – ఓం సువః – ఓం మహః – ఓం జనః – ఓం తపః – ఓం సత్యమ్.

<u>కుంభకము</u> : ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్.

<u>రేచకము</u> : ఓం ఆపో జ్యోతిరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.

**సంకల్పము :**

శ్రీగోవింద ! గోవింద ! శ్రీ మహావిష్ణో రాజ్ఞా మనువర్తమానే అస్మిన్ బ్రహ్మదివసే ద్వితీయ భాగే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోర్దక్షిణదిగ్భాగే ఆంధ్రదేశే సకలదేవతాబ్రాహ్మణహరిహరసన్నిధౌ వర్తమాన వ్యావహారికచాంద్రమానేన......నామ సంవత్సరే......అయనే......ఋతౌ......మాసే...... పక్షే......తిథౌ......వాసరే......శుభయోగే శుభనక్షత్రే శుభకరణే శ్రీమాన్...... గోత్రోద్భవ స్య......నామ్నో ధర్మపత్నీసమేతస్య మమోపాత్త సకలవిధదురితక్షయద్వారా శ్రుతిస్మృతి పురాణోక్తపుణ్యఫలసిద్ధ్యర్థం సర్వాభీష్టసిద్ధ్యర్థం శ్రీదత్తాత్రేయప్రీత్యర్థంచ తత్పూజాం కరిష్యే



# శ్రీదత్త అష్టోత్తర శతనామావళి

పత్రపుష్పాదులతో ఒక్కొక్క నామమును చెప్పుచు స్వామిపాదములను అర్చింపవలెను

| | |
|---|---|
| ఓం శ్రీదత్తాయ నమః | ఓం యోగగమ్యాయ నమః |
| ఓం దేవదత్తాయ నమః | ఓం యోగదేశకరాయ నమః |
| ఓం బ్రహ్మదత్తాయ నమః | ఓం యోగపతయే నమః |
| ఓం విష్ణుదత్తాయ నమః | ఓం యోగీశాయ నమః |
| ఓం శివదత్తాయ నమః | ఓం యోగాధీశాయ నమః |
| ఓం అత్రిదత్తాయ నమః | ఓం యోగపరాయణాయ నమః |
| ఓం అనసూయాయై నమః | ఓం యోగిధ్యేయాంఘ్రిపంకజాయ |
| ఓం అనసూయాసూనవే నమః | ఓం దిగంబరాయ నమః |
| ఓం అవధూతాయ నమః | ఓం దివ్యాంబరాయ నమః |
| ఓం ధర్మాయ నమః | ఓం పీతాంబరాయ నమః |
| ఓం ధర్మపరాయణాయ నమః | ఓం శ్వేతాంబరాయ నమః |
| ఓం ధర్మపతయే నమః | ఓం చిత్రాంబరాయ నమః |
| ఓం సిద్ధాయ నమః | ఓం బాలాయ నమః |
| ఓం సిద్ధిదాయ నమః | ఓం బాలవీర్యాయ నమః |
| ఓం సిద్ధిపతయే నమః | ఓం కుమారాయ నమః |
| ఓం సిద్ధిసేవితాయ నమః | ఓం కిశోరాయ నమః |
| ఓం గురవే నమః | ఓం కందర్పమోహనాయ నమః |
| ఓం గురుగమ్యాయ నమః | ఓం అర్ధాంగాలింగితాంగనాయనమః |
| ఓం గురోర్గురుతరాయ నమః | ఓం సురాగాయ నమః |
| ఓం గరిష్ఠాయ నమః | ఓం విరాగాయ నమః |
| ఓం వరిష్ఠాయ నమః | ఓం వీతరాగాయ నమః |
| ఓం మహిష్ఠాయ నమః | ఓం అమృతవర్షిణే నమః |
| ఓం మహాత్మనే నమః | ఓం ఉగ్రాయ నమః |
| ఓం యోగాయ నమః | ఓం అనుగ్రహాయ నమః |

ఓం స్థవిరాయ నమః
ఓం స్థవీయసే నమః
ఓం శాంతాయ నమః
ఓం అఘోరాయ నమః
ఓం మూఢాయ నమః
ఓం ఊర్ధ్వరేతసే నమః
ఓం ఏకవక్త్రాయ నమః
ఓం అనేకవక్త్రాయ నమః
ఓం ద్వినేత్రాయ నమః
ఓం త్రినేత్రాయ నమః
ఓం ద్విభుజాయ నమః
ఓం షడ్భుజాయ నమః
ఓం అక్షమాలినే నమః
ఓం కమండలుధారిణే నమః
ఓం శూలినే నమః
ఓం ఢమరుధారిణే నమః
ఓం శంఖినే నమః
ఓం గదినే నమః
ఓం మునయే నమః
ఓం మౌళినే నమః
ఓం విరూపాయ నమః
ఓం స్వరూపాయ నమః
ఓం సహస్రశిరసే నమః
ఓం సహస్రాక్షాయ నమః
ఓం సహస్రబాహవే నమః
ఓం సహస్రాయుధాయ నమః
ఓం సహస్రపాదాయ నమః
ఓం సహస్రపద్మార్చితాయ నమః
ఓం పద్మహస్తాయ నమః
ఓం పద్మపాదాయ నమః
ఓం పద్మనాభాయ నమః
ఓం పద్మమాలినే నమః
ఓం పద్మగర్భారుణాక్షాయ నమః
ఓం పద్మకింజల్కవర్చసే నమః
ఓం జ్ఞానినే నమః
ఓం జ్ఞానగమ్యాయ నమః
ఓం జ్ఞానవిజ్ఞానమూర్తయే నమః
ఓం ధ్యానినే నమః
ఓం ధ్యాననిష్ఠాయ నమః
ఓం ధ్యానస్థిమితమూర్తయే నమః
ఓం ధూళిధూసరితాంగాయ నమః
ఓం చందనలిప్తమూర్తయే నమః
ఓం భస్మోద్ధూళితదేహాయ నమః
ఓం దివ్యగంధానులేపినే నమః
ఓం ప్రసన్నాయ నమః
ఓం ప్రమత్తాయ నమః
ఓం ప్రకృష్టార్థప్రదాయ నమః
ఓం అష్టైశ్వర్యప్రదానాయ నమః
ఓం వరదాయ నమః
ఓం వరీయసే నమః
ఓం బ్రహ్మణే నమః
ఓం బ్రహ్మరూపాయ నమః
ఓం విష్ణవే నమః
ఓం విశ్వరూపిణే నమః
ఓం శంకరాయ నమః
ఓం ఆత్మనే నమః
ఓం అంతరాత్మనే నమః
ఓం పరమాత్మనే నమః
ఓం శ్రీ దత్తాత్రేయాయ నమో నమః



# శ్రీదత్త మహాగురు
# షోడశోపచార పూజావిధానము

: ధ్యానమ్ :

(ఓం) గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥

**1. ఆవాహనము :**

ఆవాహయామి సద్భక్త్యా నిత్యానందం మహామతిమ్ ।
సర్వధర్మపరం నిత్యం పూర్ణానందైకవిగ్రహమ్ ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః ఆవాహయామి.

**2. ఆసనము :**

కల్పద్రుమూలే మణివేదిమధ్యే , సింహాసనం స్వర్ణమయం సురత్నమ్ ।
విచిత్రవస్త్రాన్విత మచ్యుత ప్రభో, గృహాణ లక్ష్మీధరణీసమన్విత ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః ఆసనం సమర్పయామి.

**3. పాద్యము (పాదములు కడుగుట) :**

గంగాజలం సమానీతం సుగంధద్రవ్యసంయుతమ్ ।
పాద్యం గృహాణ భో స్వామిన్ ! తీర్థపాద దయాకర ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః పాదయోః పాద్యం సమర్పయామి.

**3. అర్ఘ్యము (చేతులు కడుగుట) :**

ధర్మస్వరూప ధర్మజ్ఞ ! తులసీదామ భూషణ ।
కంబుగ్రీవ మయా దత్తం గృహాణార్ఘ్యం నమోస్తు తే ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.

5. ఆచమనము ( గొంతు తడుపుకొనుట )

జ్ఞానవైరాగ్యసంపన్న భవరోగైక భేషజ ।
గృహాణ త్వం మయా దత్త మిదమాచమనీయకమ్ ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః ఆచమనీయం సమర్పయామి.

6. స్నానము :

గంగాదిపుణ్యసలిలైర్మయా నీతైశ్శుభావహైః ।
స్నాపయిష్యామ్యహమ్ భక్త్యా ప్రసన్నో భవ సద్గురో ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః స్నానం సమర్పయామి.

7. వస్త్రము :

స్వర్ణాంచలం చిత్రవిచిత్రశోభితం కౌశేయయుగ్మం పరికల్పితం మయా ।
దామోదర ప్రావరణం గృహాణ మాయాచల ప్రాకృతదివ్యరూప ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః వస్త్రయుగ్మం సమర్పయామి.

8. గంధము :

కస్తూరికా చన్దన కర్దమాని కాశ్మీర సంయోజిత గంధసారైః ।
విలేపనం స్వీకురు దేవదేవ ! శ్రీభూమి వక్షోజ విలేపనార్హమ్ ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః హస్తయోః గంధం ధారయామి.

9. యజ్ఞోపవీతము :

తన్తుం తన్వన్ మయా భక్త్యా బ్రహ్మసూత్రం వినిర్మితమ్ ।
దాస్యామి ధారణార్థం వై గృహాణ బ్రహ్మవిద్వర ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః యజ్ఞోపవీతం సమర్పయామి. యజ్ఞోపవీత ధారణానంతరం ఆచమనీయం సమర్పయామి.

10. పుష్పములు :

కల్హారైశ్చంపకైర్జాజీ పున్నాగైర్మల్లికాదిభిః ।
మన్దారైః పూజయిష్యామి స్వీకుర్వాచార్యసత్తమ ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః పుష్పైః పూజయామి.



: అథాంగపూజా :

| | |
|---|---|
| ఓం తీర్థపాదాయ నమః | - పాదౌ పూజయామి |
| ఓం బలాయ నమః | - జఙ్ఘే పూజయామి |
| ఓం ఆధారభూతాయ నమః | - జానునీ పూజయామి |
| ఓం విశ్వప్రపూజితాయ నమః | - ఊరూ పూజయామి |
| ఓం జితేంద్రియాయ నమః | - గుహ్యం పూజయామి |
| ఓం స్థితప్రజ్ఞాయ నమః | - కటిం పూజయామి |
| ఓం మితాశనాయ నమః | - ఉదరం పూజయామి |
| ఓం విశాల వక్షసే నమః | - వక్షఃస్థలం పూజయామి |
| ఓం శుద్ధహృదయాయ నమః | - హృదయం పూజయామి |
| ఓం శిష్య వత్సలాయ నమః | - స్తనౌ పూజయామి |
| ఓం ఆత్మోద్ధారకాయ నమః | - భుజౌ పూజయామి |
| ఓం దానహస్తాయ నమః | - హస్తౌ పూజయామి |
| ఓం కంబుకంఠాయ నమః | - కంఠం పూజయామి |
| ఓం ప్రసన్నవదనాయ నమః | - ముఖం పూజయామి |
| ఓం మృదుభాషణాయ నమః | - జిహ్వాం పూజయామి |
| ఓం కరుణాజలనిధయే నమః | - నేత్రే పూజయామి |
| ఓం శాస్త్రానుసారిణే నమః | - కర్ణౌ పూజయామి |
| ఓం సర్వజ్ఞాయ నమః | - సర్వాణ్యంగాని పూజయామి |

11. ధూపము :

వనస్పతిరసైర్దివ్యైర్నానాగంధైస్సుసంయుతమ్ ।
ఆఘ్రేయస్సర్వదేవానాం ధూపోయం ప్రతిగృహ్యతామ్ ॥

**12. దీపము :**

జ్ఞానజ్యోతిస్వరూపస్త్వ మాత్మజ్ఞానప్రదాయక ।
ఘృతవర్త్యా కృతం దీపం దాస్యామి స్వీకురు ప్రభో ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః దీపం దర్శయామి.

**13. నైవేద్యము :**

సత్యం చిత్తేన పరిషించామి । అమృతమస్తు । అమృతోపస్తరణమసి స్వాహా ।
శ్లో ॥ పక్వాన్నం పంచభక్ష్యాణి గోఘృతం సూపసంయుతమ్ ।
లేహ్యం పేయం తథా చోష్యం స్వీకురు ప్రాణవల్లభ ॥
ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, ఉత్తరాపోశనం సమర్పయామి । హస్తప్రక్షాళనం సమర్పయామి । పాదప్రక్షాళనం సమర్పయామి । శుద్ధాచమనీయం సమర్పయామి ।

**14. తాంబూలము :**

పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీదళై ర్యుతమ్ ।
ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః తాంబూలం సమర్పయామి.

**15. నీరాజనము :**

నీరాజనమిదం జ్ఞాన దీపక సద్గుణాకర ।
పూరయిత్వా మనోవాఞ్ఛాం స్వీకురు భజనప్రియ ॥
మంగళం జ్ఞానసంపన్న మంగళం సుజనప్రియ ।
మంగళం జగదుద్ధార మంగళం దేశికోత్తమ ॥
శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః నీరాజనం సమర్పయామి.

**16. మన్త్రపుష్పము :**

శ్రద్ధా భక్త్యా హ్యాసక్తైశ్చ హృత్పద్మసహితం గురో ।
మయార్పితం మన్త్రపుష్పం స్వీకురు శిష్యవత్సల ॥



నమః ప్రసన్నవదన నమః కారుణ్యసాగర ।
నమః కర్మఫలత్యాగిన్ నమః పాపనికృంతన ॥

నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే, సహస్రపాదాక్షిశిరోరుబాహవే ।
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే, సహస్రకోటీయుగధారిణే నమః ॥

శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః సప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

త్వమేవ మాతా చ పితా చ త్వమేవ, త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ, త్వమేవ సర్వం మమ దేవదేవ ॥

శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః ఛత్ర మాచ్ఛాదయామి – చామరం వీజయామి – నృత్యం దర్శయామి – ఆందోళికానారోహయామి – అశ్వానారోహయామి – గజానారోహయామి సమస్త రాజోపచార, దేవోపచార, శక్త్యుపచార, భక్త్యుపచార పూజాం సమర్పయామి ।

సర్వం శ్రీపరమేశ్వరార్పణమస్తు



# శ్రీ దత్తావతార స్తుతి

*1. యోగిరాజు:* అద్వయానందరూపాయ యోగమాయాధరాయ చ ।
యోగిరాజాయ దేవాయ శ్రీదత్తాయ నమో నమః ॥ 1

*2. అత్రివరదుడు:* మాలాకమండలుధర కరపద్మయుగ్మే
మధ్యస్థ పాణియుగళే డమరూ త్రిశూలే ।
యస్య స్త ఊర్ధ్వకరయో శ్శుభశంఖచక్రే
ధ్యాయేత్ తమత్రివరదం భుజషట్కయుక్తమ్ ॥ 2

*3. శ్రీదత్తుడు:* దత్తాత్రేయం శివం శాంత మింద్రనీలనిభం ప్రభుమ్ ।
ఆత్మమాయారతం దేవ మవధూతం దిగంబరమ్ ॥ 3
భస్మోద్ధూళిత సర్వాంగం జటాజూటధరం విభుమ్ ।
చతుర్బాహు ముదారాంగం దత్తాత్రేయం నమామ్యహమ్ ॥ 4

*4. కాలాగ్ని శమనుడు :* జ్ఞానానందైక దీప్తాయ కాలాగ్ని శమనాయ చ ।
భక్తారిష్ట వినాశాయ నమోస్తు పరమాత్మనే ॥ 5

*5. యోగిజన వల్లభుడు :* యోగ విజ్ఞన నాథాయ భక్తానంద కరాయ చ ।
దత్తాత్రేయాయ దేవాయ తేజో రూపాయ తే నమః ॥ 6

*6. లీలావిశ్వం భరుడు :* పూర్ణబ్రహ్మ స్వరూపాయ లీలా విశ్వంభరాయ చ ।
దత్తాత్రేయాయ దేవాయ నమోస్తు సర్వ సాక్షిణే ॥ 7

*7. సిద్ధరాజు :* సర్వ సిద్ధాంత సిద్ధాయ దేవాయ పరమాత్మనే ।
సిద్ధ రాజాయ సిద్ధాయ మంత్ర దాత్రే నమో నమః ॥ 8



*8. జ్ఞానసాగరుడు :* సర్వత్రాజ్ఞాన నాశాయ జ్ఞానదీపాయ చాత్మనే ।
సచ్చిదానంద బోధాయ శ్రీదత్తాయ నమో నమః ॥ 9

*9. విశ్వంభరావధూత :* విశ్వంభరాయ దేవాయ భక్తప్రియ కరాయ చ ।
భక్తప్రియాయ దేవాయ నామప్రియాయ తే నమః ॥ 10

*10. మాయాయుక్తావధూత :* మాయాయుక్తాయ శుద్ధాయ మాయాగుణహరాయ తే ।
శుద్ధబుద్ధాత్మరూపాయ నమోస్తు పరమాత్మనే ॥ 11

*11. మాయాముక్తావధూత :* స్వమాయాగుణగుప్తాయ ముక్తాయ పరమాత్మనే ।
సర్వత్రాజ్ఞాన నాశాయ దేవదేవాయ తే నమః ॥ 12

*12. ఆదిగురుడు :* సహ్యాచలనివాసాయ సగుణాయ పరాత్మనే ।
అమలకోపవిష్టాయ తే ఆదిగురవే నమః ॥ 13

*13. శివరూపుడు :* సంసారదుఃఖ నాశాయ శివాయ పరమాత్మనే ।
దత్తాత్రేయాయ దేవాయ నమోస్తు పరమాత్మనే ॥ 14

*14. శ్రీదేవదేవుడు :* సర్వాపరాధ నాశాయ సర్వపాపహరాయ చ ।
దేవదేవాయ దేవాయ నమోస్తు పరమాత్మనే ॥ 15

*15. దిగంబరుడు :* చతుర్వింశతి తత్త్వాయ వేదాంతప్రభవాయ చ ।
గురవే యదురాజస్య దిగంబరాయ తే నమః ॥ 16

*16. శ్రీకృష్ణ శ్యామ కమల నయనుడు :* అఖండాద్వైత రూపాయ నిర్గుణాయ గుణాత్మనే ।
కృష్ణాయ పద్మనేత్రాయ నమోస్తు పరమాత్మనే ॥ 17

# శ్రీ దత్తాత్రేయ ధ్యాన శ్లోకములు

శ్లో. బాలార్కప్రభమింద్రనీలజటిలం భస్మాంగరాగోజ్జ్వలం
శాంతం నాదవిలీన చిత్తపవనం శార్దూల చర్మాంబరమ్ ।
బ్రహ్మాజ్ఞై స్సనకాదిభిః పరివృతం సిద్ధై స్సమారాధితం
దత్తాత్రేయ ముపాస్మహే హృది ముదా ధ్యేయం సదా యోగిభిః ॥ 1

శ్లో. దత్తాత్రేయం సకలమునిగణై స్సేవితం విష్ణురూపం
చంద్రాక్షం చాక్షమాలాజినధరజటిలధరం పీతవర్ణం శుభాంగం ।
నానాయోగాధిరూఢం సకలఋషియుతం పావనం మౌనిరాజం
ధ్యాయేదేతం నరాణా మఖిలసుఖకరం దేవదేవం నమామి ॥ 2

శ్లో. దత్తోనామస్మరణమమలం కుర్వతాం సన్నిధానే
గూఢాకారశ్చరతి సహసా వాఞ్ఛితం దాతుకామా ।
నిత్యాకారం విమలయశసం శ్రేయసా మాదిహేతుమ్
దత్తాత్రేయం వరదమనిశం భావయామి ప్రసన్నమ్ ॥ 3

శ్లో. శాంతం పద్మాసనస్థం తరుణరవి నిభం రక్తనేత్రప్రభాసం
సిద్ధయోగీంద్రవంద్యం కలికలుషహరం కామదం కోటినేత్రం ।
కాలాకారం కులేశం కపిలతర జటాజూటమధ్యం మహేశం
దత్తాత్రేయం భజామో భవహరమమలం వేదవేదాంతవేద్యమ్ ॥ 4

శ్లో. ఆకాశే స్వప్రకాశే సకలగుణమయం సుందరం దేవదత్తం
రక్తం పద్మాసనస్థం కనకగిరినిభం రక్తనేత్రాబ్జయుగ్మం ।
ఆత్మానం సర్వభావై స్సకలగుణమయం సర్వదా యోభిపశ్యేత్
సాక్షాద్దేవ శ్శివో వా మదనదహనకృత్ ఖేచరో జాయతే సః ॥ 5



శ్లో. సురాసురసమారాధ్య మనసూయాత్రినందనమ్ ।
దత్తాత్రేయమహం వందే కరుణావరుణాలయమ్ ॥ 6

శ్లో. మనోవాక్కాయరోగాణాం హర్తారం భుక్తిముక్తిదం ।
సర్వైశ్వర్యప్రదాతారం దత్తాత్రేయం నమామ్యహమ్ ॥ 7

శ్లో. సృష్టిస్థితిలయాకారం రజస్సత్త్వతమోమయమ్ ।
శరణ్యం సర్వలోకానాం నమామి పురుషోత్తమమ్ ॥ 8

శ్లో. చరాచర జగద్వ్యాప్తం భక్త వాఞ్ఛిత పూరకమ్ ।
భజామి పుణ్డరీకాక్షం గో గోపాలన తత్పరమ్ ॥ 9

శ్లో. దత్తాత్రేయః స్వయం తీర్థరూపోపి భువి పర్యటన్ ।
నిజపర్యటనేనైవ భక్తా నుద్ధరతీశ్వరః ॥ 10

శ్లో. దత్తాత్రేయప్రసాదేన సర్వదుఃఖవివర్జితః ।
దృఢదేహో మహాయోగీ చిరంజీవీ చ జాయతే ॥ 11

శ్లో. శ్రీమహారాజ యోగీంద్ర దత్తాత్రేయ దయానిధే ।
శీఘ్రమాగచ్ఛ మాం రక్ష శ్రియం స్థిరాం ప్రదేహి మే ॥ 12

శ్లో. స్వాత్మనైవ స్వయం దత్తః స్వసమస్య విసన్నిధేః ।
అత్రేయత్వం గతో యస్తం దత్తాత్రేయం నమామ్యహమ్ ॥ 13

శ్లో. స్తుతిమాత్రేణ భక్తానాం ఛిన్దత్యాశు దరిద్రతామ్ ।
భవబంధం హరేద్యస్తం ప్రపద్యే శరణం హరిమ్ ॥ 14



నరహరి అను భక్తుడు చేసిన

# శ్రీగురు స్తోత్రము

శ్లో ॥ కోట్యర్కభం కోటి మృగాంక శీతం విశ్వాశ్రయం దేవ గణార్చితాంఘ్రిమ్ ।
భక్తప్రియం త్వాత్రిసుతం వరేణ్యం వందే నృసింహేశ్వర పాహి మాం త్వమ్॥ 1
శ్లో ॥ మాయాతమోర్కం విగుణం గుణాఢ్యం శ్రీవల్లభం స్వీకృత భిక్షు వేషమ్ ।
సద్భక్త సేవ్యం వరదం వరిష్ఠం వందే నృసింహేశ్వర పాహి మాం త్వమ్ ॥ 2
శ్లో ॥ కామాదిషణ్మత్త గజాంకుశం త్వా మానంద కందం పరతత్త్వ రూపం ।
సద్ధర్మ గుప్త్యై విధృతావతారం వందే నృసింహేశ్వర పాహి మాం త్వమ్ ॥ 3
శ్లో ॥ సూర్యేందుగం సజ్జన కామధేనుం మృషోద్య పఞ్చాత్మక భూత మస్మాత్ ।
ఉదేతి యస్మిన్ రమతేస్తమేతి వందే నృసింహేశ్వర పాహి మాం త్వమ్ ॥ 4
శ్లో ॥ రక్తాబ్జ పత్రాయత కాన్తనేత్రం సద్దణ్డ కుణ్డీ పరిహాపితాఘమ్ ।
శ్రితస్మితజ్యోత్స్నముఖేందుశోభం వందే నృసింహేశ్వర పాహి మాం త్వమ్ ॥ 5
శ్లో ॥ నిత్యం త్రయీ మృగ్యపదాబ్జధూళిం నినాద సద్బిందు కళాస్వరూపమ్ ।
త్రితాప తప్తాశ్రిత కల్పవృక్షం వందే నృసింహేశ్వర పాహి మాం త్వమ్ ॥ 6
శ్లో ॥ దైన్యాది భీకష్ట దవాగ్ని మీడ్యం యోగాష్టకజ్ఞాన సమర్పణోత్కమ్ ।
కృష్ణానదీ పఞ్చ సరిద్యుతిస్థం వందే నృసింహేశ్వర పాహి మాం త్వమ్ ॥ 7
శ్లో ॥ అనాది మధ్యాంతమనంతశక్తి మతర్క్య భావం పరమాత్మసంజ్ఞమ్ ।
వ్యతీత వాగ్వృక్పథ మద్వితీయం వందే నృసింహేశ్వర పాహి మాం త్వమ్ ॥ 8
శ్లో ॥ యో నృసింహ సరస్వత్యా అష్టకం పఠతీహ సః ।
దీర్ఘాయు స్సంస్మృతిం తీర్త్వాభీష్టం లబ్ధ్వామృతం లభేత్ ॥ 9





నందిశర్మ అను భక్తుడు చేసిన

# శ్రీగురు స్తోత్రము

ఇందు కోటి తేజ కీర్ణ సింధు భక్తవత్సలమ్
నందనాత్రి సూను దత్త మిందిరాక్ష శ్రీగురుమ్।
గంధ మాల్య అక్షతాది వృంద దేవ వందితమ్
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మామ్ ॥

1

మోహ పాశ అంధకార జాత దూర భాస్కరమ్
ఆయతాక్ష పాహి శ్రీయ వల్లభేశ నాయకమ్ ।
సేవ్య భక్త వృంద వరద భూయభూయ నమామ్యహమ్
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మామ్ ॥

2

చిత్తజారి వర్గ షట్క మత్త వారణాంకుశమ్
సత్త్వసార శోభితాత్మ దత్తశ్రీయ వల్లభమ్ ।
ఉత్తమావతార భూత కర్తృ భక్తవత్సలమ్
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మామ్ ॥

3

వ్యోమ వాయు తేజ ఆప భూమి కర్తృ మీశ్వరమ్ ।
కామ క్రోధ మోహ రహిత సోమ సూర్య లోచనమ్।
కామితార్థ దాతృ భక్త కామధేను శ్రీగురుమ్
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మామ్ ॥

4

పుణ్డరీక ఆయతాక్ష కుణ్డలేందు తేజసమ్
చణ్డ దురిత ఖణ్డనార్థ దణ్డధారి శ్రీగురుమ్ ।

మణ్డలీక మౌళి మార్తాణ్డ భాసితాననమ్
వందయామి నారసింహ సరస్వతీశ పాహిమామ్ ॥

5

వేద శాస్త్ర స్తుత్య పాద మాదిమూర్తి శ్రీగురుమ్
నాద బిందు కళాతీత కల్ప పాదపాదృశమ్ ।
సేవ్య భక్త బృంద వరద భూయ భూయ నమామ్యహమ్
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మామ్ ॥

6

అష్ట యోగ తత్త్వ నిష్ఠ తుష్ట జ్ఞాన వారిధిమ్
కృష్ణ వేణి తీర వాస పంచ నద్య సఙ్గమమ్ ।
కష్ట దైన్య దూర భక్త తుష్ట కామ్య దాయకమ్
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మామ్ ॥

7

నారసింహ సరస్వతీయ నామ అష్ట మౌక్తికమ్
హార కృత్య శారదేన గఙ్గాధరాఖ్య స్వాత్మజమ్।
ధారణీక దేవ దీక్ష గురుర్మూర్తి తోషితమ్
వందయామి నారసింహ సరస్వతీశ పాహిమామ్ ॥

8

నారసింహ సరస్వతీశ అష్టకఞ్చ యః పఠేత్
ఘోర సంసార సింధు తారణాఖ్య సాధనమ్ ।
సార జ్ఞాన దీర్ఘ ఆయురారోగ్యాది సంపదం
చారు వర్గ కామ్య లాభ నిత్యమేవ యః పఠేత్ ॥

9

# శ్రీ దత్త ప్రపత్తి




జగదంబికాధరణి । సింధుకుమార్యనఘాసరస్వతీ
పూజితుఁడౌ నిజోద్భవవి।భూతిబహూకృతమాతృభూతసత్
స్త్రీజనుఁడౌ శుభంకరవి।శిష్టనిజాంఘ్రిగృహీతదివ్యనీ
రాజనుఁడౌ నినుం బొగడ।రాదు మనుష్యుల కత్రినందనా 1

సురతటినీసుధాకరసు।శోభితశుద్ధశిరా ! శిరస్సరో
వరవికచాద్భుతాంబుజస।హస్రసహస్రమయూఖసుందరా !
దరనికరాపహోధరసదాదర।హాసధరా ! ధరాధరాం
తరకృతమందిరా ! తనువుఁ। దప్పక కావవె యత్రినందనా 2

నిత్యము నిన్ను నెంచి నరు।లిద్ధర దేవసమానులౌదురే !
నిత్యము మమ్మునెంచి బహు । నీచవిపత్తులనుంచి కావఁగా
సత్యముగా నరాకృతిని । జన్మము నెత్తుచునుంటి వీవు, నీ
భృత్యజనావనంబులు న।భూతభవిష్యము లత్రినందనా ! 3

బంధము లేదు నీకని ని।బద్ధిగ మాకెఱుకయ్యెఁ బూర్వమే
యంధతమస్సులన్ దులిపి।నట్టి కతంబునఁ ;గాని భక్త సం

బంధముచేత నీకు నపవర్గము లాభము లేదు ; నీదు సం
బంధముచేత భక్తు లపవర్గముఁ బొందెద రత్రినందనా ! 4

ఉ. సేవలు సేవలంచు బహు । చేష్టలు చేయుచునుంటిమేము, మా
భావములోపలన్ భవదభావముఁ గప్పికొనంగ ; మమ్ము నీ
శావకులంచు నెంచి యొక । చక్కని తండ్రి విధాన లోపముల్
పోవ క్షమించి మాదు కొలుపుల్ గయికొమ్మికఁ నత్రినందనా! 5

ఉ. పాయక పల్ పురాణములు । బాల్యమునుండియు వింటి నేను, జూ
చాయగఁ దారసిల్లె నొక । చక్కని నీదు పవిత్రనామ, "మే
మో ! యొక పూర్వకాలఘన । మౌని యగున్ మనకేల" యంచు నే
ధ్యేయముఁ బెట్టనైతి, నిపు । డించుకెఱింగితి నత్రినందనా ! 6

ఉ. సంపదకొక్క దేవి, సరసంబుల కింకొక దేవుఁ , డెల్ల వ
ల్లింపుల కొక్క దేవి, యడలింపులు బాప మఱొక్క వేల్పు , పా
లింపఁగ నొక్క దేవుఁ , డవి । నిన్నటి మాటలు ; నేఁడివెల్ల సా
ధింపఁగ మాకు నీ వొకఁడె । దేవుఁడవై నిలు మత్రినందనా ! 7

ఉ. జాతకదోషముల్ చెఱుప । జన్మవిశేష మనుగ్రహింప మా
పాతకముల్ క్షమింప బహుబాధకరోగములన్ గుదుర్పఁగా
ఘాతుక జంతుపీడ తొలఁగగన్ బహుమంగళమాన్యధాన్య రై
జాతము వొంద నీ కరుణశక్తియె చాలెడు నత్రినందనా ! 8



చ. ఒక జనయిత్రి దీవెనలు । వంద శుభంబులొసంగి కాచుఁ , దా
మొక ప్రియతాతు ప్రేమమయ । మౌ పలుకిచ్చెదు నాధిపత్య , మిం
కొక గురువర్యు నాశిషలు । కోటిగుణంబులుగా ఫలించు, వీ
రికి బహుకోట్ల రెట్లు గద । నీదు ప్రసాదము లత్రినందనా ! 9

ఉ. లాభములేక మానవులు । లక్ష్యము సేయరు దేనినైన లౌ
క్యాభినివేశవశ్యులయి ; । యావదుదారవరంబులెప్పుడున్
లాభముమాటయెత్తకె విలాసముగా సమనుగ్రహించు నీ
శోభనశీలమే తెరువు । సూపవలెన్ వెస నత్రినందనా ! 10

ఉ. ఇప్పటిదాక సాఁగినవి । హింస్రములై హృదయాభిఘాతలై
యొప్పెను జీవితంబున ; మఱొక్క భవంబునకెన్ని యున్నవో
కుప్పలు పాపముల్ మిగిలి ; । గుర్తుకువచ్చిన భీతి గల్గెడున్
దప్పక యిప్పుడప్పుడును । దాఁపున నుండవె యత్రినందనా ! 11

ఉ. వర్తులరీతిగా గురుని । వద్దను ఛాత్రులు సేరి శాస్త్ర మా
వర్తన జేయుచుండ విను । వాడుక యున్నది కాని చిత్ర మీ
వార్తలు చుట్టుచేరి యెఱువన్ వినుచుందువు స్వామి ! దక్షిణా
మూర్తివి మౌనభాష్యముల । ముచ్చట నీకిది యత్రినందనా ! 12

ఉ. జంతువులందు మానవుని । జన్మము దుర్లభమంట, మానుషం
బంతటిలోను బుంస్త్వమది । యబ్బురమంట, సమస్తపొంస్నమం
దాంతరవాణియైన వసుధామరుఁ డౌటపురూపమంట, నే

నెంతును నిన్ భజించుటది । యింకను హెచ్చని యత్రినందనా !
13

ఉ. కాలమువోలె, నాకసము । కైవడి, నంకెల బారుతీరు నీ
లీల లనంతముల్ ; నరుల । లెక్కల కందని వద్భుతావతా
రాలు ; త్వదీయభాగవతు । లందరి పుణ్యవిశిష్టసత్కథా
జాలములెల్ల నీ విమల । సచ్చరితంబగు నత్రినందనా !
14

ఉ. అయ్యెడ రక్తమాంసమయ । మైన మనుష్యశరీరమూని సా
హాయ్యము చేసినట్లిపుడు । హార్దిక భక్త్యనుభావవంతులై
యెయ్యన నిన్ను వేఁడికొను । యోగ్యులహస్తములందికొంటయున్
న్యాయ్యము ; భేదభావముల । కగ్గము సేయకు మత్రినందనా !
15

ఉ. ప్రస్తుతకాలమందుఁ బ్రతిపత్తు విశేషిత దుష్కథా వృథా
విస్తరమై నశించెడిఁ ; బవిత్రచరిత్రములన్ బఠించుటల్
నిస్తులదైవనామములు । నిచ్చలు నిష్ఠమెయిన్ భజించుటల్
వస్తుసమార్జనావిముఖ । వైఖరి కావలె నత్రినందనా !
16

ఉ. ఎన్ని దశల్ స్థితుల్ గడిచి । యిచ్చటి కే మరుదెంచినామొ, యిం
కెన్ని తరించి గాని విషయేతర సుస్థితిఁ బొందఁజాలమో,
సున్న గదా ఫలంబు పురుషోచితయత్నము నమ్మికొంటచే :
నెన్నెద సద్గురుండవగు । నిన్నె మనంబున నత్రినందనా !
17



ఉ. బాలుఁడు తానుగా నెఱుఁగ । బల్లిదుఁడే తలిదండ్రి లేక ? తో
డేలులు వెంచినట్టి నర । డింభకుఁ డెంత వయస్సు వచ్చినన్
నాలుఁగు కాళ్ళపై నడచు, । నందున నొక్క మహాగురుండు లే
కేల యెఱుంగనౌఁ బరముఁ । డెల్ల మనుష్యుల కత్రినందనా ? 18

ఉ. ముఖములు మూడు వేదములు, భూరిభుజంబులువానికంగముల్,
మఖములు నీకు శ్వాసలు సుమా ! భువనంబులు గర్భగోళముల్,
సుఖమృదులాంబరంబులగు । షోడశసంస్కరణంబు, లంబుభూ
సఖములు నీదు పాదములు । సంహృతశోకము లత్రినందనా !
19

ఉ. ఈ జగమందు సద్గురువు । లెల్లరు నీవె, మతంబులెల్ల నీ
రాజనముల్ భవద్వదనరశ్మికిఁ , బూజనముల్ :
భవత్కృపాభాజనముల్, జనార్దనకపర్దిపితామహమిశ్రశక్తి వి
భ్రాజనముల్ భవత్తనువిభావవిపాకము లత్రినందనా ! 20

ఉ. ధారుణిసంప్రదాయసముదాయపితామహుఁ డీవె, సర్వవి
ద్యారమణీయవర్షజల । ధారలకుం బ్రభవంబ వీవె, క
ర్మారణికిం బ్రదీపనమహాగ్నివి నీవె యసత్సదాత్మ తా
రారుణఖేటరాశులకు । నంబరమీవయ ! యత్రినందనా !
21

ఉ. అమ్మలకమ్మ , వన్నలకు । నన్నవు , తండ్రుల తండ్రి , వన్గు నే
స్తమ్ముల నేస్తమౌ, ముసలి । తాతల తాతవు , స్వర్గలోక దై
వమ్ముల కేకదైవమవు । వాసిగ నీదు వయస్సుఁ జెప్ప సా

ధ్యమ్మగునే మహర్షులకు ? దత్తమహాగురు ! అత్రినందనా !

22

ఉ. కానిన లీలలన్ మరలఁ । గాన్పవు, పూనిన జన్మ క్రమ్మఱం

బూన వొసంగినట్టి పరఃబోధఁ దిరుంగ నొసంగఁబోవు, నీ

వైనపు వాఁడ వీవొకఁడఃవే, పరులెవ్వరు గాని లేరు , ప్రా

చీనుఁడవయ్యు నెల్లపుడుఁ । జిత్రచరిత్రుఁడ వత్రినందనా !

23

ఉ. నాఁటెపు బ్రహ్మచారివయి । నమ్మిన వారికిఁ జేతు విష్ట క

ల్యాణము, నిత్యభిక్షుకుఁడ । వయ్యు నొసంగెదు ప్రాజ్యరాజ్యముల్,

వాణి ననుగ్రహించి కవిఃవర్యునిఁ జేతువు శుంఠనైన , సు

స్థాణువువోలె మౌనము వ్రతంబుగఁ బూనియు నత్రినందనా !

24

ఉ. అలరులఁ గమ్మతావివలె । నర్భకులందు నమాయకత్వముం

బలె, బహుపూర్వజన్మముల । బంధురపుణ్యమువోలె మాదు క

న్నులకు నగోచరంబు త్వదఃనుగ్రహమాత్మభవంబు ; ధాత్రి వా

నలొక శరత్తుపాటు పడఃనప్పు డెఱుంగుదు మత్రినందనా ! 25

ఉ. సులభము దుష్టశిక్షణము । శుద్ధుల రక్షణ దైవమైన నీ ;

కలవి మనుష్యమాత్రులకుఁ । గా దుభయంబును నైన నేఁటి వా

రల సమయింప కుత్తమతఃరంబగు త్రోవకు మంచిమాటలన్

మలుపుట నీకుఁ దప్ప గురుఃమాత్రశరీరక ! యత్రినందనా !

26



ఉ. చెప్పినదాలకించు వరఃశిష్యుల పట్ల వరప్రదాత,వ

ట్లొప్పనివారి పట్లను గఃఠోర గభీరతలన్ వహింతు, వె

ల్లప్పుడు భక్తకోటి యెడఃలన్ గరుణాపరుఁడయ్యు వారి నీ

వొప్పరికింతు తట్టుకొనఃకున్నఁ బరీక్షల కత్రినందనా ! 27

ఉ. దేవుఁడుగా సమస్తము విఃధించిన పాత్ర వహించియుండినన్

భావనఁ జేయనివ్వవు ప్రఃపంచములోఁ గల తల్లిదండ్రిగాఁ

గేవల పుత్ర మైత్రి తమ । కిష్టములేని కతంబునన్ ; మను

ష్యావళి కీవు సద్గురుఁడ । వౌటకె కోరెద వత్రినందనా !

28

ఉ. ఏది ఘటిల్లినన్ దలఁతు । నేనది నీ సమనుగ్రహంబుగా

నేది యొనర్పఁగల్గినను । నేననుకొందు భవత్ప్రసాదమం

చేది లభించినన్నెడఁద । నెంచెద నీదు కృపావరంబుగా

మోదముతోడఁ దేల్చినను । ముంచిన నీదయ యత్రినందనా !

29

ఉ. మా మనసార నిన్ను బహు । మార్గములన్ స్తుతియింతు, మింకనున్

నేమముగా నహర్నిశలు । నీ గురునామమునే జపింతు, మి

ష్టామల పక్వ భోజ్యముఁ బ్రఃసాదముగాఁ గయికొందు, మావు పా

లేమభిషేకమిచ్చెద, మిఁ । కేమి యొనర్చెద మత్రినందనా ! 30

ఉ. నీ వివిధావతారముల । నెత్తిననాఁటి యనుగ్రహంబులే

భావనఁ జేయ నస్మదనుఃభవ్యముఁ జేయుము, మా దరిద్రముల్

పోవఁగని, మ్మభీష్ట తనుఃభోగములిమ్ము , శరీర భాండముల్

కావు మనామయంబులుగఁ । గాంచుము ప్రేముడి నత్రినందనా !
31

ఉ. భౌతికభోగభాగ్యములఁ । బూర్వయుగంబులవారికంటె స
ర్వాతిశయంబు మాకుఁ గల । దైనను వారల శ్రద్ధ భక్తి దీ
క్షాతపముల్ సకృత్తుగను । గానవు మా యుగమందుఁ , గాన నే
రీతిగనైనఁ బెట్టకు పరీక్షలు మాకిల నత్రినందనా !
32

ఉ. పంచషలన్ భరించుట విపత్తయి పాతి తురీయ మాశ్రమం
బెంచెడు వారు కొంద, రొక । యేటికి నష్టము రా భృతంబుఁ ద
గ్గించెడు వారు కొందరు ; ప్రకీర్ణచరాచరభూతకోటిఁ బో
షించెడు నిన్ను నేమని వచింపఁగఁజాలుదు మత్రినందనా !
33

ఉ. ఈశునికంటె శీఘ్రముగ । నిష్టలపైఁ గరుణింతువంట, య
య్యాశుగు మించి వేగముగ । నాశ్రితులొద్దకు వత్తువంట, వా
గీశునికంటె హెచ్చుగఁ బ్రకృత్యధికారములున్నవంట, నీ
వే శరణంబు నాకు నిది । విన్నయనంతర మత్రినందనా !
34

ఉ. నామసహస్రపాఠము ననారతమున్ భవదీయదివ్యగా
థామృతపానముం జలుపు । ధన్యుల భీతులు వాపి దోషముల్
తోమి సుదీర్ఘరోగముల । దుర్గతులన్నిటినుండి యోమి జ్ఞా
నామలినాంజనంబు నయనంబులఁ బ్రామెద వత్రినందనా ! 35

ఉ. చేరి ఋణానుబంధములుఁ । జెల్మలుఁ గల్మలుఁ దెల్వితేఁటలున్



సారవివేచనశ్రుతవిచారము । లెల్ల నశించు మేనితోఁ ;
దీఱక వేయిజన్మలవధిన్ నిలువంబడు శుద్ధభక్తి సం
స్కారము నీ స్వరూపమగు । సద్గురు నంఘ్రుల నత్రినందనా !
36

ఉ. మంపునఁ దొల్లి యొజ్జ నవమానములాడిన దోషరాశి మ
న్నింపుము; నీ చరిత్రమును । నిండఁ బఠింతు నటంచుఁ బూని పూ
రింపని నాదు లోపము భరింపుము ; దేహమనోఽర్థి నిన్నుఁ బూ
జింపని నాళ్ళ లోటు దయచేసి క్షమింపుమిఁ కత్రినందనా !
37

ఉ. తెంపరినై నివేదనకుఁ । దేక యొకండనె (యొకర్తినె) తింటినేని మ
న్నింపుము జంతుతుల్యమగు । నీచపుటాఁకలి ; మ్రొక్కు వెట్టి చె
ల్లింపనిచోఁ గనంబడి కనీసము మా కలనైనఁ జెప్పు ; కో
పింపకుమా ! కటూక్తుల శపింపకుమా ! శర ణత్రినందనా !
38

ఉ. గంపెడు కార్యభారమునఁ । గన్పడినప్పు డెఱంగనేని మ
న్నింపుము ; శూన్యచిత్తమున । నీ కపచారములయ్యేనేని ల
క్షింపకు ; నీదు దర్శనము । జేయు ప్రతీపరి దక్షిణార్థ మ
ర్పింపని పట్ల నీ కరుణభిక్షను మాకిడు మత్రినందనా !
39

ఉ. ఇంపగు నీదు పూజ నితరేతరయోచనఁ జేసి యున్నచో
లెంపలు వేసికొందుఁ : బరులెవ్వరినైనను భంగపర్చినన్
జెంపలుగొట్టుకొందుఁ, గడచెన్ దినమంచు భవత్ప్రసాద మా
శింపనినాడు నేనుపవసింతు దినార్థక మత్రినందనా ! 40

ఉ. అంపఅలైన స్వంత వ్యవహారములం బడి నీవు స్వప్నమం
దంపిన సాధనావిధుల । నాచరణం బొనరింపనేనిఁ బా
లింపుము, స్వప్నబోధ మొదలే మతిమాలినచో క్షమించి ర
క్షింపుము, లేనిచోఁ బలుకు । చెంతఁ గనంబడి యత్రినందనా !

41

ఉ. గుంపులుగా విపత్తులెద । ఘూర్ణిలఁ జేసిననాఁడు భక్తిఁ బా
టింపక దైవలీలలను । దిట్టిన దుర్బలమానుషంబు మ
న్నింపుము, హైందవాన్యమహనీయుల దూఱిన తప్పు పట్ల రో
షింపకు, వీనికై కఠిన । శిక్షలు వేయకు మత్రినందనా !

42

ఉ. పాపములన్ హరించు సురవాహిని విష్ణుపదప్రభూతయై
తాపములన్ హరించును సుధాకరుఁ డీశ్వరమౌళిరత్నమై
పాపును దైన్యమున్ సురభి । భాగ్యవిధాయిని : పాపతాప దై
న్యాపనయక్షమంబు భవదద్భుతదర్శన మత్రినందనా !

43

ఉ. కామిత మొక్కటే యొసఁగుఁ । గామపయస్విని కల్పశాఖి చిం
తామణి : నీ స్వరూపమగు । తత్వగురుం డటు గాక నిర్మల
ప్రేమ వరించినట్టివి వరింపనియట్టివి రెండు శ్రేయముల్
క్షేమముగా నొసంగి నిజ । శిష్యులఁ బ్రోఁచెడు నత్రినందనా !

44

ఉ. వేఱు పదార్థమున్ బరుసువేది పసిండిగ మార్చుఁ : దన్ వలెన్
వేఱొక దివ్యమౌ పరుసువేదినిఁ జేయఁగలేదు : శిష్యులన్



మీరు తమంతలై పరిణమించి యొకొక్కరు నొక్క దత్తుఁడౌ
తీరునఁ దీర్చిదిద్దెద రతీంద్రియచేతన, యత్రినందనా !

45

ఉ. స్వీయపురాకృతోత్థఫల । సిద్ధి మనుష్యుల కెల్ల నిత్య వై
ధాయకమైన దేవ ! భవదాశ్రితకోటికి మాత్ర ముర్విలో
నీ యనుకంపలం దెలియనిచ్చుచునే పరమార్థబోధ క
గ్రాయణమై కరంబు నుపకారముఁ జేసెదు నత్రినందనా !

46

ఉ. దేవుఁ దనంగ దత్తుఁ డొకఁడే, మతధర్మమనంగ సద్గురున్
స్థావరజంగమాత్మకవిశాలజగత్పతిగా భజించుటే
భూవలయంబునం బరమ । పూజితపుస్తకమన్నఁ దన్మహా
జీవితగాథయే, యతనిఁ । జేరుటె మంత్రము లత్రినందనా !

47

ఉ. పాకమెఱుంగనట్టి దిన । వారములున్నవి, మేనిమీఁద వ
స్త్రాకలనంబు లేని దివసంబులు నున్నవి, భూమిపాలకుల్
లేక యరాజకంబుగఁ జరించిన రోజులు నుండెఁ గాని నిన్
లోకులు కొల్వనట్టి చెడు । రోజులు లేవిల నత్రినందనా !

48

ఉ. ధన్యులు నీ నిమిత్తమయి । తారుపవాసము లుండు వారలున్
ధన్యులు నిన్ దలంచుచు సదా యిహమేమఱచుండు వారలున్
ధన్యులు నిన్ భజించి గళ । ధామము గద్గదమైన వారు స
మ్మాన్యులు నీదుపొంతె సిరి । మాలినవారలు నత్రినందనా !

49

చ. ముసిరిన చీఁకటుల్ తొలఁగు, । మూడిన కీళ్ళుశమించు, నుల్లపుం
గసటులు వోయి నిర్మలముగా నగుఁ , బట్టిపలార్చుచుండు వె
క్కసమగు లేమి వాయుఁ , ద్వదఖండ పవిత్ర చరిత్ర చిత్ర వా
గ్రసమున మాకు బాటలు సరాళమగున్ వెస నత్రినందనా !

50

ఉ. వానలు గోర వెల్లువలు । వాఱఁగనిత్తువు, పాలు గోరినన్
బానకమట్లు తియ్యనగు । పాల సముద్రములిత్తు , నీడకై
మానిసి వేఁడ రాణ్మకుట । మాతనికిం దగిలింతు వర్మిలిన్
నీ నిరవద్యమౌ కృప భరించుటయుం గడిఁ దత్రినందనా !

51

ఉ. దొంగలకుం గనంబడదు, । దోషములార్చి శుభంబుఁ బెంచు, స
త్సంగవశాన నింక బల । శాలినియౌ, యుగసంక్షయంబునన్
భంగముఁజెంద, దింకొక భవంబునఁ దాఁ గొనసాఁగు, నిన్నుఁ జెం
దంగల భక్తి చిత్తమున । డాఁగిన శేవధి యత్రినందనా !

52

ఉ. ఆర్యక ! నీదు జ్ఞానమున । కంతము లేదు, త్వదీయ దివ్య సౌం
దర్యమనంత, మింక భవదగ్రిమకీర్తి యనంతమౌ, త్వదై
శ్వర్యమనంత, మాత్మగతశక్తి యనంతము, సర్వ దేవతా
వర్యుఁడ, వీశ లక్షణసువాసితుఁడౌ, గురు, అత్రినందనా !

53

ఉ. కొలిచినఁ బల్కు దైవములుఁ , । గోరిన వారికిఁ గొంగుబంగరుల్
బలిమిని మూఁగవారి బహు । భాషలుగా నొనరించు వేలుపుల్
నలఁతఁ గుదుర్చువారు, నయనాలిడి యాంధ్యముఁ బాపు దేవతల్



కలరనుటే వదంతి నినుఁ । గాంచక ముందఱ నత్రినందనా ! 54

చ. పురుషుఁడుగా వధూటిగను । భూపతిగా మఱి భూసురుండుగా
ధరఁ దనువెన్నిసారులిటు । దాల్చితిమో యభినేతలట్లు ! దొం
తరలుగఁ బాపపుణ్యములు । దాఁగినవింకను నెన్ని యున్నవో !
గురువర ! చాలు రూపకము, । కొమ్మిఁక నీదరి కత్రినందనా !

55

ఉ. సోలెదు నంతరాత్మునకు । శుక్రసమానుఁడు దేశికుండు, భూ
పాలపు రాగ మాయన కృపాపరబోధన, మోదబాష్పముల్
బాలతుషారబిందువులు, । పండిన జ్ఞానము భాస్కరోదయం,
బోలములేని నిత్యదివసోష్ణము జీవిత మత్రినందనా !

56

ఉ. ఎన్నడొ జన్మకొక్కపరి । యెందుకొ నిన్నుఁ దలంచువారలన్
మన్నన జేసినట్లె నిను । మానక కొల్చెదువారిఁ జూడు ; మా
పన్నులమైన మాకుఁ ద్వదపారకృపారసదృష్టివృష్టి లే
కున్న మహాతమోమయమగున్ బ్రతుకంతయు నత్రినందనా !

57

ఉ. లేమి వరించి కెన్వలువ । లేమొ ధరించి నిజాంతరాహిత
స్తోమము గెల్చి రోజుకొక । తూరి పురంబున భిక్ష జేసి భీ
మామరజానదీద్వయసమాగమతీరమునం బ్రశాంతిగా
బ్రేమ కుటీరమందున । జపించుట మిమ్మెపు డత్రినందనా ?

58

ఉ. ఆయతమౌ నహంకృతి ననంతదురాశ నరాతిషట్కమున్
వేయి విధాలఁ గల్మిములు । వేయఁగఁ జూచి వశంబు గాక మే
మా యతనంబు మానితిమి ; మా కుపకారము సేయఁగోరినన్
జేయుము శక్తిపాతమెదొ ; చే విదిలింపకు మత్రినందనా !

59

ఉ. లేదు తపస్సు , దానములు । లేవు , శుచిత్వము లేదు , సత్యమున్
లే, దమలార్జవం బసలు । లే, దొక యోగము యాగమన్నదే
లే, దుపవాసమన్నదియు । లేదు, చరించుటలేదు బ్రహ్మలో ;
మా దరి కేఁగుదెంపకనవద్దయ ! నీ దయ ! అత్రినందనా !

60

చ. ముదిరిన పిచ్చిలక్షణము । మూలముగా నరుఁ డౌషధంబులన్
జెదరఁగఁ గొట్టినట్లు బహుజీర్ణభవోన్మదనంబు చేత మా
యెదలకుఁ గాలకూటవిష । మై స్ఫురియించుఁ బరార్థవాణి ; యీ
గదమునకీవె, లేదు మఱొకండు చికిత్సకుఁ దత్రినందనా !

61

చ.. గురుని సమాశ్రయించుటన । గొప్ప విశేషము ; దానిమీఁద నా
గురుని యనుగ్రహంబు సమకూడుటయన్న మఱింతగా మహ
త్తర, మది నిల్పికోఁగలుగుటన్న మహత్తమ, మట్టి సర్వ సద్
గురుపతివైన నిన్ను మదిఁ । గొల్చుట నీ దయ, యత్రినందనా !

62

ఉ. మాయని సత్త్వమున్న గురు । మానవుఁడంచుఁ దలంచువారుఁ , బా
రాయణ పుస్తకంబులను । బ్రాఁత పురాణములంచు నెంచు వా



రాయన స్వప్నదర్శనము । భ్రాంతియటంచు భ్రమించువారు నా
రాయణ ! యింక బాగుపడ । రక్కడ నిక్కడ నత్రినందనా !

63

ఉ. అబ్బిన శాస్త్రమంత్రముల । నక్షరసంపుటిగాఁ దలంచు వాఁ
డబ్బురమైన దేవు స్థిరదారుశిలాత్మకమంచు నెంచు వాఁ
డుబ్బి ప్రసాదతీర్థముల । నొట్టి పదార్థములంచుఁ బల్కు వా
డబ్బ ! మఱింక బాగుపడఁ । డక్కడ నిక్కడ నత్రినందనా !.

64

ఉ. శంకరుఁ డాగ్రహించినను । సద్గురుసత్తముఁ డట్టి ఛాత్రునిన్
జంకను దాచి కాచికొను ; । సద్గురుఁడే యలుఁగంగ శిష్యుపై
శంకరునంతవాఁడయిన । శక్తివిరాజితుఁడైనఁ గావఁగా
జంకుచు వెండికొండ మొగసాలలు మూసెడు నత్రినందనా ! 65

ఉ. లోకములోని ప్రేమ లతిలోపమయంబులు ; తల్లిదండ్రియున్
దోకమునుండి గౌరవపుఁదోఁకలు గోరెద,రా యపత్యముల్
శ్రీకయి తల్లిదండ్రుల విశీర్ణతఁ గోరెద, రైన జ్ఞాన స
జ్జీకృతముల్ వరిష్ఠ గురుశిష్యుల బంధము లత్రినందనా !

66

ఉ. ఇంకను వేయిజన్మముల । నిచ్చితివేనియు మాకిదే వృథా
సంకటపూర్ణజీవితము । సంభవమౌ, భయభోజనవ్యవా
యాంకిత జంతువృత్తివలనన్ విసుగుండదు, సంతసింప మే
శంకలు లేక మోక్షము నొసంగెదవన్నను నత్రినందనా ! 67

ఉ. ఇభ్యుఁడుగా జనించి యితరేతరులన్ శ్రమపెట్టుటే సదా
యభ్యసనంబు జేసి తదగాధమహాఘవశానఁ గ్రమ్మఱన్
దేభ్యపు జన్మలెత్తి తన । దైన్యముచేత మతింత పాపియౌ ;
నభ్యుదయంబు లేదు, వశ । మైనను బుణ్యము లత్రినందనా !

68

ఉ. తాను వసించు పంజరమె । ధన్యమటంచెడు పక్షి యుండునే ?
బోను సుఖంబుగాఁ దలవఁ । బోవునె సింహకిశోరమైనఁ ? గా
రా నిలయంబు స్వీయమగునా యటఁ బుట్టినవానికైన ? స్వ
స్థానముగా నరుండొకఁడె । తల్చును లోకము నత్రినందనా !

69

చ. జగతి పరోపవర్తనము, । సత్యము దేహములద్దెకొంపలౌ,
నగణితకాల మాగని ప్రయాణము, లోకులు తోడియాత్రికుల్,
దిగుటయు నెక్కుచుండుటయుఁ । దీఅని కార్యకలాప, మన్నమై
మిగులును బాపపుణ్యగణ । మిట్టి దశాశ్వత మత్రినందనా !

70

ఉ. వాస్తుఁట, సంఖ్యలంట, గ్రహ । వైఖరులంట, లలాటమంట, మా
హస్తములందు రేఖలఁట, । హద్దులుగా శకునంబులంట, యం
తస్తిలకంబులంట, మత । ధర్మములంట, ప్రభుత్వమంట ; యీ
విస్తృతబంధనాలు నర । విప్రుషమోర్చునె ? యత్రినందనా !

71

చ. మునుల చరిత్రముల్ చదివి । ముందటి జన్మములందునేనియున్
మునిచరితంబుఁ బూన మన । ముచ్చిలులూరును గాని యంతలో
ధనికులఁ జూచి ప్రస్తుతపు । దైన్యము వోయెదు దారిఁ గోరు , నా



మనుజమనఃపరిప్లవత । మాన్పుము నమ్మితి నత్రినందనా !

72

ఉ. విగ్రహమందు నొక్క చిర । విద్రధి పుట్టఁగ దానినే మహో
దగ్రముగా నొనర్చుటకు । నాహరణం బుపయోగపడ్డటుల్
స్వోగ్రమనోరథంబులను । బ్రస్తుతపుణ్యము లేష్యజన్మలన్
వ్యగ్రవిధానఁ దీర్చి యఘ । వారిధిఁ ద్రోసెడు నత్రినందనా ! 73

చ. ఇదుములు దీఱి సౌఖ్యము జనించు భవిష్యమునందటంచుఁ దాఁ
గడుపును గాలు గట్టుకొని । కాసు గడించును వెఱ్ఱిమానవుం ;
డొడలు శ్రమింపరాదని మనోవికలత్వము జెంది విద్య నే
ర్చెడు ; నెటు జూచినన్ సుఖముచేటు మనుష్యున కత్రినందనా !

74

ఉ. దుఃఖము సంగ్రహించుట చతుర్విధసంపద ; సంగ్రహించినన్
దుఃఖము దానినిన్ దొరలు । దొంగలు దోచకయుండఁ గాచుటల్ ;
దుఃఖ మవశ్యమైన యపుడున్న ధనంబును ఖర్చుపెట్టుటల్ ;
దుఃఖము గానిదేది ధర । దుడ్డుల ప్రస్తుతి ? నత్రినందనా ! 75

ఉ. ఐహికభోగభాగ్యవిజయంబులు బొందినవారిఁ జూచి సం
దేహములేక లోకులు నదే సుఖమార్గముగాఁ దలంత్రు ; ప్రా
గ్దేహమునందు వారు గురుదేవు భజించుటెఱుంగలేరు ; స
ర్వేహల కడ్డదారి యదియే, ఋషిపూజిత ! యత్రినందనా !

76

చ. గురువొకఁడున్నచోఁ జదువు । గొప్ప విశేషము గాదు వ్యక్తికిన్ ;
గురువులు లేనిచోఁ జదువు । గొప్ప విశేషము గాదు మానిసిన్ ;
గురుచరణారవిందగత । గౌరవభావమె వారి నీడయో
యెఱుక కతంబునన్ సుఖముఁలేర్పడఁజేసెడు నత్రినందనా !

77

ఉ. ఇక్కలికాలమందుఁ ద్రఁయాశ ! యదేమి విచిత్రమో కదా !
రొక్కముఁ గండ్లఁ జూడక మఱొక్కరి కష్టసుఖంబులెవ్వరున్
నిక్కముగాఁ జెవి న్నిడరు ; । నిర్ఘరులైన నిదే విధంబు ; నే
నక్కతనన్ గురుండవని । నమ్మితి నీదయ నత్రినందనా !

78

ఉ. బాల్యము దాఁటిపోవుఁ దన । బాబును దల్లిని దృష్టిపెట్ట, శై
థిల్యముఁ జెందు యౌవనము । తీర్పఁ గుటుంబజనాభిలాషఁ , బ్రా
బల్యము గల్గు కొల్వుయజమానుల మెప్పుగడింపఁ జిక్కి తా
శల్యమగున్, నిను న్నెపుడు । సంతసపెట్టెడు నత్రినందనా ?

79

చ. కలిగిన దానిలోఁ దనివిఁ । గానక యింకను నింకఁ గావలెన్,
వలవదు నాకు నీ దినుసుఁవశ్యము నాకది యంచు బుద్ధిలో
బలు చపలాప్రయోజకపు । భావములేర్పడినంత కాలమున్
నిలువదు ధ్యానధారణము । నీపయి నిశ్చయ మత్రినందనా !

80

ఉ. ఒక్కటి తీఱినన్ మఱొక । వాంఛ జనింపకమాన, దేమియున్
జిక్కనిచో మనుష్యమతి । సృష్టియొనర్పఁగఁగల్గు నేవొ క్రొ
మ్మక్కువ లాత్మచాతురిని, । మానవుఁ దర్వదియేండ్లకే యిటుల్



ముక్కడియైన నేమగునొ । పూర్తిశతంబున కత్రినందనా !

81

ఉ. స్వీయగుణస్తవంబు పర । శీలవిగర్హణ మట్లు కానిచో
హేయతరప్రవృత్తిగత । హేలయు భూతభవిష్యమాత్ర సం
ధాయక దుష్టభాషణము । తప్ప మనఃపరిపూర్తిగా నినున్
ధ్యేయముఁ జేయఁగా దొరుకఁదే క్షణమాత్రము నత్రినందనా !

82

చ. కుడుచుట కొల్వుసేయుటకుఁ । గొల్వొనరించుట కూటికోస, మి
ప్పుడు జనులాచరించు పరఁబోధ యిదే సుమి, యంతెకాని, యీ
యడుగులు తీర్థయాత్రకని, । హస్తములర్చనకంచు, వాగ్బలం
బుడుగని దైవసన్నుతుల । కుండుటెఱుంగరె ? యత్రినందనా !

83

ఉ. మంచిగఁ దన్నుఁ గూర్చి జను । లాడవలెన్ బహుళప్రశంసనా
లంచు నరుండు సేయు మిగుఁలన్ దయితక్కులు గాని యీ ప్రశం
సించిన వారె పేఁదకడిఁ । జిందెదరాపయిఁ , గాన నీవు గు
ర్తించుటకే నరుండు శ్రమఁదీసికొనందగు నత్రినందనా !

84

చ. దినమునఁ గొంతసేపు భవఁదీయసమక్షమునందు నున్న మా
త్రన నిఁక నన్ని బాధ్యతలు । దత్తునివే యని పల్కుచుందు రీ
జనులు ; తదీయభాగ్యమును । స్వస్థతయున్ జయముల్ భవిష్యమున్
మనమున నీడలే, రవి భఁవత్పరమెట్లగు నత్రినందనా !

85

ఉ. అల్పములైన స్వార్థము లహంకృతు లిష్ట మనిష్టమున్ స్వసం
కల్ప వికల్పముల్ విడిచి । గాలికిc గొట్టుకపోవు నెండుటాc
కు ల్పరమాయణంబు తనకున్ ధరలో నని నమ్మి గుండెలో
నల్పెఱుcగండు, సర్వశరణాగతుcడౌc దమ కత్రినందనా !

86

ఉ. క్రొత్తదనాలు చిప్పిలcగ । రోయక చేయుట పాడి నిత్య నై
మిత్తిక కార్యమైనను ; నమేయఫలావహమైన సద్గురూ
పాత్త చరిత్రపాఠమును । బ్రత్యహమందికొనంగ నిత్య నై
మిత్తిక కార్యమై పరిణమించుట దుఃఖద మత్రినందనా !

87

ఉ. వాడిన వస్త్రముల్ తమకు । వాడిన పువ్వులు నూనెనేతులున్
వేడుకతో సమర్పణము । వెట్టcగరాదని వింటిc గాని నా
నాడును లోకసంగతుల । నంటులువద్ద మనోవచస్సులన్
గూడి యొనర్చుచుండెద మకుంఠితపూజల నత్రినందనా !

88

ఉ. మానవుc డీషణత్రయము । మానుపవచ్చుc బ్రయత్నపూర్తిగా,
మానసికారిషట్కమును । మాపcగవచ్చుc బ్రశాంతచిత్తుcడై,
నేనను భావమున్ వదలనేఱcడు, జీవనమాధురీసురా
పానముc గూడ వీడcడు భవత్కృప లేనపు దత్రినందనా ! 89

చ. సిరులు ననామయత్వమును । జిక్కిన దేహము దూదిపింజయౌ,
పరమగు జన్మ , మీ జగతి । స్వర్గము, నిత్యవసంత మెల్లెడన్,
దొరకనిచో శరీరమొక । దుర్భరభారము, జన్మ శాపమౌ,



నరక మిహప్రపంచక, మనంతనిదాఘుక మత్రినందనా !

90

ఉ. మంచికొ చెడ్డకో యిది తమర్ సృజియించిన లోక, మెచ్చు లా
శించుట బాలభావ, మిటc । జిక్కినదే భగవత్ప్రసాద మం
చెంచి సుఖించి తృప్తిపడుటే ఘనయోగము ; నిన్ను మించి మా
కించుకయే నెఱుంగనగునే ? గురుసత్తమ ! యత్రినందనా !

91

ఉ. సంతత మన్నదానములు । సల్పినc గల్గు సుదీర్ఘ మాయు వా
నంతరజన్మ , నార్తులకు । నర్థముc గోరక వైద్యమిచ్చు వా
రింతయు ఖాయిలాపడరు, । రిక్థముc గోరక విద్యసెప్ప ది
గ్దంతి యగున్, బ్రసాదమిదు । తాదృగదృష్టము నత్రినందనా !

92

ఉ. దర్వికరైకమాలి ! తలిదండ్రులు దేశికుc డీశ్వరుండు గం
ధర్వసురాసురాదికము । ధర్మము జాతకముల్ పురాణముల్
సర్వము నమ్మకంబులను । చట్రపుc బెన్వలయంబులోన నం
తర్వలయంబు, లందున ఋతం బెఱిcగింపవె యత్రినందనా !

93

ఉ. ఇక్కడ నింక నుంటిమనుటే సరిపోవు గతంబుc జెప్పcగా ;
బెక్కు సహస్రకోటియుగ । బృందములందు భవంబులెత్తియున్
జక్కని జ్ఞానమార్గమున । సాcగక యెప్పటికప్పుడేవొ క్రొ
మ్మక్కువ లేపుగాc బెనిచి । మ్రగ్గుచు నుంటిమిటత్రినందనా !

94

చ. విమలపరాక్రమంబున భు౹వి న్నిజహస్తగతంబుఁ జేసియున్
సుమశరకల్పరూపమున । సుందరులెందరినో వశించినన్
స్వమతివిభూతి నష్టవిధ । సంపదలన్ సమకూర్చికొన్న స్వాం
తమునను దృప్తిజెందఁడు గ౹దా నరుఁ డర్భకుఁ డత్రినందనా !

95

ఉ. నౌకరి లేనివారు నను । నన్నివిధంబుల మించువారలున్
లౌకికులైనవారు బహు । లోకులు గల్గఁగ లోకమందునన్
నాకు ననుగ్రహంబు మెయి । నాలుఁగు ఊల నొసంగుచుంటివే
నీ కరుణాకటాక్షమెటు । లేనెఱుఁగంగల నత్రినందనా !

96

ఉ. సొంపగు నైకపుష్పవన । శోభలు, నింపులు గుల్కు జీవముల్
పెంపగు స్వాదునీరములుఁ । బేశలసత్ఫలధాన్యశాకముల్
నింపి ప్రపంచమిచ్చితివి, । నీ కిహలోకదురూహధారతోఁ
గంపులుగొట్టు చిత్తఫల౹కం బెటు లిచ్చెద మత్రినందనా !

97

ఉ. ఎన్నడొ జన్మ కొక్కపరి । యెందుకొ నిన్నుఁ దలంచువారలన్
మన్నన జేసినట్లె నిను । మానక కొల్చెడు వారిఁ జూడు, మా
పన్నులమైన మాకుఁ ద్వద౹పారకృపారసవృష్టి లే Repeated composition
కున్న మహాతమోమయమ౹గున్ బ్రతుకంతయు నత్రినందనా ! See poem No.57

98

ఉ. వంద కవిత్వఖండికల । వర్ణన జేయుట సాహసంబు నీ
చంద మనంతవిశ్వమొక । స్వల్పతరంబగు సూక్ష్మదుర్భిణిన్
బందినిఁ జేయఁబూనుటగుఁ , । బారము లేని మహార్ణవంబు నా



నం దమకించుటౌను స్మర౹నైక సమీపక ! యత్రినందనా !

99

ఉ. బంధుర శోకముల్ నిభృతిఁ । బర్యవసించెదు, నిర్భరానురా
గాంధత మౌనమందుఁ దుదిఁ । గర్భితమయ్యెడు, సౌఖ్య వాహినుల్
సింధు గభీర నీరవతఁ । జెందెడు, నట్లె మదీయ భక్తి స
ద్గంధము మిన్నకుండుఁ దుదిఁ । గంతమునెత్తక యత్రినందనా !

100

ఉ. వృక్షములందు నౌషధపు । విల్వలు లేనిది లేదటంద్రు, బీ
జాక్షరమై వెలుంగనిది । సంస్కృత భాషను లేదు కావునన్
లక్షల కొద్ది నీ స్తవము । లందిది యన్యతమంబె కాని నీ
దక్షత చేతఁ బత్యమయి । ధన్యము గావలె నత్రినందనా !

101

ఉ. ఇంచుక నాదు శక్తి మతి । యించుక పొందితి కావ్య శిక్షణం
బించుక లోక శాస్త్ర సమ । వేక్షణ మించుక భక్తి భావనం
బించుక యైన నీ శతక । మిష్టముగా నినుఁ గూర్చి యిట్లు వ్రా
యించుక స్వీకరించితి స౹హింపుము దోషము ల౹త్రినందనా !

102

ఉ. అనులిన తాడెపల్లి సుకు౹లాంబుధిచంద్రుఁడు బాలసుబ్రమ
ణ్యము సురభారతీగురుఁడు । హైదరబాదియు గర్తపట్టణా
గ్రిమ హరితాఖ్యగోత్రుఁ డిది । క్రీస్తుశకంబున రెండువేల మూఁ
డమరఁగ ముప్పదాఱగు వ౹యస్సున నీకిడె నత్రినందనా ! 103

: ఇంద్రవంశా వృత్తము :

దత్తప్రపత్తిం గడు । దాంతశాంతమౌ
చిత్తంబుతోఁ బాడెదు । శిష్టకోటికిన్
విత్తంబు స్వాస్థ్యంబును । విస్తృతాయువున్
హత్తించి కావంగల । వత్రినందనా ! 104



2003, Copies : 1000.